





శ్రీ

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీ ఆంజనేయదండకము.

ఇది

విశాఖపట్నం బుక్ సెల్లర్

అగ్రహారపు సూర్యనారాయణగారిచే

శ్రీ వేణుగోపాలముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపబడియె.

విశాఖపట్టణము.

1909.



శ్రీరస్తు.

---

# శ్రీఆంజనేయదండక ప్రారంభము.

శ్రీఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం ప్రకీర్తిప్రదాయం ప్రశస్తప్రకాశాయం భజేవాయుపుత్రం, భజేవాలగాత్రం భజేహంపవిత్రం, భజేసూర్యమిత్రం భజేరుద్రరూపం భజేబ్రహ్మతేజం బటంచున్, ప్రభాతంబు సాయంత్రమున్ నీనామ సంకీర్తనల్ జేసినీరూపు వర్ణించి నీమీదనేదండకంబొక్కటింజేయ నూహించి నీమూర్తిగావించి నీసుందరంబెంచి నీదాస దాసుండనై రామభక్తుండనై నిన్ను నేగొలిచెదన్ నిన్ను నేదలచెదన్ నీకటాక్షంబునన్ జూచితే వేడుకల్ జేసితే, నామొరాలించితే నన్ను రక్షించితే అంజనాదేవిగర్భాన్వయా దేవ నిన్నెంచ నేనెంతవాడన్ దయాశాలివై జూచితే

దాతవై బోయిచితె దగ్గరన్నిలచితే తొల్లిసుగ్రీవుకున్మంత్రి
వైస్వామికార్యంబునందుండి శ్రీరామసౌమిత్రులంజూచి
వారిన్విచారించి, సర్వేశుపూజించి యబ్భానుజుంబంటు
గావించి యవ్వాలినింజంపి కాకుత్థ్సతిలకుం దయాదృ
ష్టివీక్షించి కిష్కింధయేలించి శ్రీరాము కార్యార్థమై
లంకకేతెంచియున్, లంకిణిన్జంపియున్ లంకయుంగా
ల్చియుం భూమిజంజూచి యానంద ముప్పొంగి, యా
వుంగరంబిచ్చి యారత్నముందెచ్చి శ్రీరాముకుంనిచ్చి సం
తోషుఁజేసి సుగ్రీవుడంగదా జాంబవంతాది నీలాదు
లఁగూడి యాసేతువుందాటి వానరామూక పెన్మూకలై
దైత్యులఁద్రుంచగా, రావణుండంత కాలాగ్నుడై యు
గ్రుడై కోరి బ్రహ్మాండమైనట్టి, యాశక్తియుంవేసి యా
లక్ష్మణుం మూర్ఛగావించగానప్పుడే వేగ సంజీవియుందె
చ్చి సౌమిత్రికింనిచ్చి ప్రాణంబురక్షించగా యాకుంభక
ర్ణాదులం వీరాదివీరులం మరింబోరి శ్రీరాముబాణాగ్ని వా
రందరుం యారావణుం జంపగా నంతలోకంబు లానంద
మైయుండ యవ్వేళల యవ్విభీషణుం వేడుకన్ దోడుకన్
వచ్చి పట్టాభిషేకంబు చేయించి సీతామహాదేవియుందె

చ్చి శ్రీరాముకున్ నిచ్చి నంతనయోధ్యకుంవచ్చి పట్టా
భిషేకంబనేకంబు సంరంభమైయున్న నీకన్న నాకెవ్వరుం
కూర్మిలేరంచుమన్నించినన్ రామభక్తప్రసన్నంబుగానిన్ను
నీనామసంకీర్తనల్ జేసితే పాపముల్ బాయునే భయము
లుందీరునే భాగ్యముల్ గల్గునే సకలసామ్రాజ్యముల్ సక
లసంపత్కరముల్ గల్గునో వానరాకారయోభక్తమందా
ర యోపుణ్యసంచార యోధీరయోధీర నీవేసమస్తం
బు నీవేమహాజయం నీవేమహాఫలముగా వెలసియాతా
రక బ్రహ్మమంత్రంబు పఠియించుచున్ స్థిరముగావజ్రదే
హంబునుందాల్చి శ్రీరామ శ్రీరామ శ్రీరామ యంచున్
మనఃపూతమైయెప్పుడున్ దప్పకందలచు నాజిహ్వాయం
దున్ దీర్ఘదేహంబునన్ త్రైలోకసంచారివై రామనా
మాంకితధ్యానివై బ్రహ్మవై బ్రహ్మతేజంబునన్ రౌద్ర
నిజ్వాల కల్లోలహావీరహనుమంత ఓంకార ఓంకార
ఓంకారశబ్దంబులం పిశాచంబులం భూతప్రేతపిశాచశాకిని
ఢాకినీగాలిదయ్యంబులన్ నీవువాలంబునన్ చుట్టినేలంబ
డంగొట్టినీముష్టిఘాతంబులన్ బాహుదండంబులన్ రోమ
ఖండంబులన్ద్రుంచికాలాగ్నిరుద్రుండవై బ్రహ్మప్రభాబా

శ్రీఆంజనేయదండకము.

సితంబై ననీదివ్య తేజంబునన్ జూచిరారనాముద్దు నరసింహ్వా యంచున్ దయాదృష్టివీక్షించి నన్నేలునాస్వామి నమస్తే సదాబ్రహ్మచారి నమస్తే వాయుపుత్రా నమస్తే పూర్ణ హారినమస్తే నమస్తే నమస్తే నమః.

శ్రీ ఆంజనేయదండకము

సంపూర్ణము.

శ్రీఆంజనేయాష్టోత్తర శతనామశ్లోకాః.

ఆంజనేయో మహావీరో హనుమా న్మారుతాత్మజః। తత్త్వజ్ఞాన ప్రదస్సీతా దేవిముద్రా ప్రదాయకః ౧॥

అశోకవనికాచ్ఛేత్తా సర్వమాయా విభంజనః। సర్వబంధ విమోక్తాచ రక్షోవిధ్వంసకారకః॥ ౨॥

పరవిద్యా పరిహారః పరశౌర్య వినాశన। పరమంత్రనిరాకర్తా పరయంత్ర ప్రభేదకః॥ ౩॥

సర్వగ్రహ వినాశీచ భీమసేన సహాయకృత్। సర్వదుఃఖ హారస్సర్వలోకాచారీమనోజవః॥ ౪॥

పారిజాత ద్రుమూలస్థస్సర్వమంత్ర స్వరూపవాన్। సర్వతంత్ర స్వరూపీణ సర్వయంత్రాత్మకస్తథా॥ ౫॥

కపీశ్వరో మహాకాయ స్సర్వరోగ హరః ప్రభుః। బల

సిద్ధి కరస్సర్వ విద్యాసం పత్ప్రదాయకః॥ ౬॥

కపిసేనా నాయకశ్చ విశ్వవ్యచ్చతురాననః॥ కుమార
బ్రహ్మాచారీచ రత్నకుండల దీప్తమాన్॥ ౭॥

సంచలద్వాల సన్నద్ధ లంబవాల శిఖోజ్వలః॥ గంధర్వ
విద్యాతత్వజ్ఞో మహాబల పరాక్రమః॥ ౮॥

కరాగృహ విమోక్తాచ శృంఖలో బంధమోచకః॥సాగ
రోత్తారకః ప్రాజ్ఞో రామదూతః రామదూతఃప్రతాపవాన్॥

వానరః కేసరీ సుతః సీతాశోకనివారణః॥ అంజనాగ
ర్భ సంభూతో బాలార్క సదృశాననః॥ ౧౦॥

విభీషణ ప్రియకరో దశగ్రీవకులాంతకః॥ లక్షణ ప్రాణ
దా తాచ వజ్రకాయో మహాద్యుతిః॥ ౧౧॥

చిరంజీవు రామభక్తో దైత్యకార్య విఘాతకః॥ అక్ష
హంతా కాంచనాభః పంచవక్త్రో మహాతపాః ౧౨॥
లంకిణీభం జనశ్శ్రీమాన్ సింహికా ప్రాణభంజనః॥ గంధ
మాదన శైలస్థో లంకాపుర విదాహకః॥ ౧౩॥

సుగ్రీవసచివోధీర శ్శూరోదైత్యకులాంతకః సురార్చి
తో మహాతేజా రామచూడా మణిప్రదః॥ ౧౪॥

రామరూపీ పింగళాక్షో వారిధి లోకపూజిత॥గమ్మరీకృత

మార్తాండ లోవిజి తేంద్రియః॥ ౧౫॥

రామసుగ్రీవ సందాత్రు మహారావణ మర్ధన। స్ఫటికా
భోవాగధీశో నలనాకృతిపండితః॥ ౧౬॥

చతుర్బాహు ర్దీనబంధుఃర్మహాత్మా భక్తవత్సలః। సంజీ
వన నగాహార్తా శుచిర్వాగి దృఢవ్రతః॥ ౧౭॥

కాలనేమి ప్రమథనో హరి మర్కటమర్కటః। దాంత
శ్శాంతః ప్రసన్నాత్మా శతకంఠ మదాపహృత్॥ ౧౮॥

యోగిరామ కలోలోలా సీతాన్వేషణ పండితః। వజ్ర
దంష్ట్రో వజ్రనఖో రంచివీర్యసముద్భవః॥ ౧౯॥

ఇంద్ర జిత్ప్రహితా మోఘ బ్రహ్మాస్త్రవినివారకః।
పార్థధ్వజాగ్ర సంవాసి దరపంజన భేదకః॥ ౨౦॥

దశబాహు ర్లోకపూజ్యో జాంబవత్ప్రీతి వర్ధనః। సీతా
సమేత శ్రీరామ పాదసేవా దురంధరః॥ ౨౧॥

ఇత్యేవం శ్రీహనుమతో నామ్నానిఅష్టోత్తరంశతం। యః
పఠేచ్ఛృణుయాన్నిత్యంసర్వాకామానవాప్నుయాత్॥

ఇతి కాళికారహస్యే- ఆంజనేయాష్టోత్తర
శతనామశ్లోక- సంపూర్ణాః



# ప్రకటన.

మావద్ద సంస్కృతాంధ్రగ్రంధములు స్టేషనరీ సామానులును దొరకును పైగ్రామస్తులకు వి. పి. ద్వారాపంపబడును వి. పి. చార్జి కొనువారేభరించవలెను.

నృసింహశతకము.
రామతారకశతకము.
దాశరధీశతకము.
మల్లికార్జునశతకము.
వేణుగోపాలశతకము.
తాడిమళ్లశతకము.
సుమతీశతకము.

కృష్ణశతకము.
నారాయణశతకము.
రామరామశతకము
కుమారీశతకము.
సదానందయోగిశతకము
బాలరామాయణము.
భారతసావిత్రి.

యీగ్రంధములు యింకాకావలయు గ్రంధములు యీడిగువ ముద్రనుగలవారి పేరవ్రాసి తెప్పించుకోవలెను,

అగ్రహారపు సూర్యనారాయణ,
బుక్ సెల్లర్స్, మెయిన్ రోడ్డు
విశాఖపట్నం.

